# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర పుష్య బ॥ ౬
గురువారము


## భిన్న దృక్పథాలు

రాజ్యాంగము చాణక్యునికాలము నుండియు ఒక ముఖ్యతంత్రమై యున్నది. ఒక దేశములోని స్థితిగతులు దాని ప్రభుత్వపద్ధతిపై ఆధారపడి యుండును. ప్రజలఅభిప్రాయానికేపూర్తిగా ఎచ్చటవిలువయుండునో అది మంచి ప్రభుత్వమనిపించుకొనునని స్థూలముగా చెప్పవచ్చును. అయితే ప్రజలేమి అంతమంచివారా? వారు పొరపడరా? వారిలో ఐకమత్యముండునా? అందరు ఏకాభిప్రాయులగుటయెట్లు? అని ప్రశ్నపరంపరను నివర్తించుటకు వారికిగాను ఒక ప్రత్యేక గ్రంథమే వ్రాయవలసియుండును. ప్రజలలో బహుళసంఖ్యాకులేది బాగనితలతురో దానికే విలువయుండును. అట్టి బహుళసంఖ్యాకులుకూడా పొరపాటుచేయవచ్చును. తమకేదిపథ్యమో అది నష్టకారియైనను వారికి తృప్తికరముగా ఉండును. పరదేశమువారు ఒక విదేశాన్ని బలవంతముగా లోబరచుకొని దానిని బాగా పరిపాలించినను కూడా అది మంచిప్రభుత్వమనిపించుకొనదు. ఎందుకనగా అచ్చటి ప్రజలకు స్వాతంత్ర్యము లేకపోయెను. “స్వపరిపాలనమునకు మంచి ప్రభుత్వము ఎన్నటికిని ప్రత్యామ్నాయము కానేరదు” అని ఒక సుప్రసిద్ధమైన ఇంగ్లీషు ఆభాణముకలదు.

ఈ కాలములో భారతదేశములో రాజ్యాంగనిర్మాణమునుగూర్చిన చర్యలు చాలాబయలు దేరినవి. హిందూముస్లిము ల ఇండియా, బ్రిటిషిండియా, దేశీరాజుల ఇండియా, హిందూస్థాన్, పాకిస్థాన్ అను విభేదాలు దేశమంతటను వ్యాపించియున్నవి. కాలముతీవ్రముగా అనుకోనంతటి వేగముతో మారిపోతూఉన్నది- ఇంతలో ఎంతటిమార్పు వచ్చునోఅని చిన్నవారును పెద్దవారును అందరునూ అట్టి రానున్న మార్పునుఎదుర్కొనుటకుతమతమ వర్గదృష్టితో, మతదృష్టితో ఎత్తులు వేయుచున్నారు. ఇదంతయు అధికారకాంక్షతోకూడినట్టిచర్యయే యని స్పష్టమగుచున్నది. హిందూస్థాన దురదృష్టముచేత ఇచ్చట నానామతాలు, నానారాజ్యాలు, వివిధభాషలు, వివిధసంస్కృతులు, ప్రబలిపోయియున్నవి. ముస్లిములీగువారు ముస్లిములు ప్రత్యేకజాతియని వాదించుచున్నారు. హిందూమహాసభవారు హిందూస్థానము మాది అనుచున్నారు. దేశీరాజులు ఫెడరేషనులో చేరదలచుకొనలేదు. ఇంగ్లీషువారు భారతదేశానికిపూర్ణస్వాతంత్ర్యమ ఇయ్యదలచుకోలేదు. వివిధభాషలవారు తమతమ భాషాభిమానముచే భిన్నులగుచున్నారు. ఈసందడిలో హిందూస్థానీభాషవారు తమభాషను భారతదేశముపై మోపజూచుచున్నారు. కాని ఉర్దూవారు వారితో వివాదపడుచున్నారు. హిందీవారును, ఉర్దూవారును భారతదేశ భాషాసామ్రాజ్యాధిపత్యానికి పోటీపడుచున్నారు.

దేశీసంస్థానాలలో కూడా హిందూ ముస్లింవిభేదాలు ఏర్పడియున్నవి. అఖిల దేశీసంస్థానముస్లింలీగు ఏర్పడింది. ముస్లింలీగు వెనువెంటనే హిందూ మహాసభయు సిద్ధమైనది. అఖిలదేశీసంస్థాన హిందూ మహాసభయు స్వరూపము పొందినది. హిందూసంస్థానం ముస్లింసంస్థానంఅను పేరులు వాటినిపాలించు ప్రభువులనుబట్టియే ఏర్పడియున్నవి. అంటే ప్రజలకు విలువ లేదన్నమాట. ప్రజాబాహుళ్యాన్ని బట్టి నిర్వచింపవలసివచ్చినచో హైదరాబాదు సంస్థానమును హిందూస్థానమనవలెను. కాశ్మీరుసంస్థానాన్ని ముస్లింసంస్థానమనవలెను భారతదేశసంస్థానాల చరిత్రలో కాశ్మీరు హైదరాబాదుసంస్థానాలచరిత్రి పరస్పరానుబంధరూపముగా ఉండుట ఒక విచిత్రపరిణామనిదర్శనముగా ఉన్నది. హైదరాబాదులో శ్రీ ప్రభువుగారు ముస్లిములు. ప్రజలు విశేషముగా హిందువులు. కాశ్మీరులో శ్రీ ప్రభువుగారు హిందువులు. ప్రజలు విశేషముగా ముస్లిములు. హైదరాబాదులో ప్రభువుగారి మాతృభాష సర్కారీభాష యైనది. కాశ్మీరులో ప్రభువుగారి మాతృభాష సర్కారీభాషయైనది. హైదరాబాదులో హిందువులుఉర్దూను దానిలిపినిఆక్షేపించుచున్నారు. కాశ్మీరులో ముస్లిములు కాశ్మీరీభాషను, నాగరీలిపిని ఆక్షేపించుచున్నారు. హైదరాబాదులోముస్లిములకే నూటికి ౮౦ వరకు సర్కారీ ఉద్యోగాలుకలవు (ఇంకను పేలుపట్వారీలు చేరలేదు. వారివంశపారంపర్యాధికారాలను లాగివేసి ఇతరోద్యోగులవలెనే నౌకర్లను జీతమిచ్చి ఏర్పాటు చేయవలెనని ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘమువారు చాలాప్రయత్నాలు చేయుచున్నారు) కాశ్మీరులో హిందువులకే ఎక్కువ ఉద్యోగాలున్నవని వినుచున్నాము. కాశ్మీరులో హిందువులు ప్రభువర్గమువారు. హైదరాబాదులోనిముస్లిములు “ఆఖాలు” “అనల్ మలికు”లు “ఉ౦౦ఏండ్ల నుండి దక్కనీరాజ్యాన్ని బాహుబలముచే పరిపాలించిన ప్రభుజాతి”. కాశ్మీరుముస్లిములు ప్రజాప్రభుత్వాన్ని అనగా బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరుచున్నారు. హిందువులు అది మాసంస్థానానికి సరిపడనేసరిపడదంటున్నారు. హైదరాబాదులో హిందువులు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరుచున్నారు. ముస్లిములు అనగా ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘమువారు అది యేమాత్రమున్నాకూడదు, దానివాసనయే మాకు సరిపడదు, దానిపేరే మేము విననొల్లము అని చెప్పుచున్నారు. ఈరెండుసంస్థానాలలోని భిన్నదృక్పథాలలోని అంతరార్థమెంతైనను కలదు. ప్రభుత్వాధికారాలలో ప్రధానావలంబనము కగిన జాతి తమ అధికారము కొక్కడపోవునో అని భయపడుచు మార్పునుకోనివారై దానిని ప్రతిఘటించుటకు తమ మనసులలో విలీనమై యున్న భావాలను స్పష్టముగా వెలిబుచ్చక మూలసిద్ధాంతాలే సరియైనవికావని క్రొత్తసిద్ధాంతాలను స్థాపించుటకై భగీరథప్రయత్నాలు చేయుచున్నారు. భారతీయముస్లిములు ప్రత్యేకజాతి అను జిన్నాఖాయదెఆజంగారి క్రొత్తసిద్ధాంతములోని అర్థమిదే. హైదరాబాదుముస్లిములకు ప్రభుత్వోద్యోగాలు ఒకముఖ్యమైన ఆర్థికసమస్యఅను నూతన సిద్ధాంతములోనిఅంతరార్థముకూడా ఇదే. ప్రపంచములో నెందునుకూడా ప్రభుత్వోద్యోగాలను వ్యాపారసంస్థలవలె ముఖ్యార్థిక సంపాదనగా ఏవర్గమున్నా ఏర్పాటు చేసుకొనియుండలేదు. బ్రతుకలేక బడిపంతులైనట్లుగా వేరేవిధముగా సంపాదించుటకు వీలులేక మాకు ఇదే సంపాదనమార్గము అనుట సరికానేరదు. అది ప్రభుత్వానికిని నష్టకారియగును. అర్హతయే ఉద్యోగాలకు తగినట్టికొలని ఆర్థికంగా వెనుకబడినవారికందరికిని ఉద్యోగాలిచ్చి ఆ లోపాన్ని పూరించుమని యేబుద్ధిమంతులునూ చెప్పరు. అట్లు ఏప్రభుత్వమున్నా చేయదు.

బాధ్యతాయుత ప్రభుత్వానికి మన హైదరాబాదు ముస్లింనాయకులు విరుద్ధముగా వాదించుచున్నారు. దానికి యింతవరకు సరియగు సమాధానము వ్యక్తముకాకుండెను. ఇప్పుడు వ్యక్తమైయున్నది. నవాబు బహద్దరుయారుజంగు బహద్దరు ఖాయదెమిల్లత్ గారు దానిని వ్యక్తపరచినారు. నవాబు బహద్దరుగారిలో స్పష్టముగా చెప్పుట యొకవిశిష్టగుణము. వారు హైదరాబాదు ముస్లిములకు ఏకైకనాయకులు. వారికి ప్రభుమాన్యత చాలా హెచ్చుగా ఉన్నదనుటకు వారికి మనపూజ్య ప్రభువులుంగారు గతమాసమందు చేతిగుండీలు బహుమానముగా ఇచ్చి వాటిని వారిజాగీరుకు మోటారులో పంపించినదిసాక్షి తెలిగియే యున్నారు. అట్టిఖాయదె మిల్లత్ గారు మొన్న జాల్నాలో జరిగినసభలో ఈవిధముగా సెలవిచ్చినారు.

> “హైదరాబాదు రాష్ట్రములో కొన్ని వర్గాలవారు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరుచున్నారు, అదియేర్పాటుచేసినట్లయితే ముస్లిములలో కేంద్రీకృతమైన అధికారము వారినుండి విడిపోయి యితరులకు సంక్రమించును అందుచేతనే మజ్లిసె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వారుదానికివిరుద్ధులైయున్నారు. మేము ఎల్లప్పటికినీ దానికి విరుద్ధులముగా ఉండి దానిని ప్రతిఘటించుచుండగలము అయితే యీవిధముగా మేము ప్రతిఘటించినప్పుడు ఇప్పటి ప్రభుత్వానికంటేమేలైనట్టిదియుదూరదృష్టికలదియునగు ప్రభుత్వము కావలెనని కోరుటకు బాధ్యులమైయున్నాము.”

నవాబుగారిపై వాక్యాలలో రెండువిషయాలు కనబడుచున్నవి. బాధ్యతాయుతప్రభుత్వమువలన ముస్లిములకు నష్టము. ఎట్లునష్టమనగా వారిలోఇప్పుడుండు అధికారము ఇకముందుఉండదని వారివాదము. కావున ముస్లిముల అధికారము, ఆధిపత్యము, ప్రభుశక్తి శాశ్వతముగాఉండవలెనంటే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని శాశ్వతంగా ప్రతిఘటించుచు ఉండవలెను. రెండవదేమన ఇప్పుడుండు ప్రభుత్వపద్ధతికూడా ఇత్తెహాదువారికి తృప్తికరముగా లేనట్లున్నది. ఇంతకంటె మేలైన ప్రభుత్వము కావలెనంటున్నారు. మరి అట్టిమేలైన ప్రభుత్వానికి దూరదృష్టి కూడా ఉండవలెనట. ఆ దూరదృష్టి యెట్టిదిగా ఉండవలెనో తెలుపలేదు. ఇంతకంటె మేలైన ప్రభుత్వమంటె యెట్టిదిగా ఉండవలెనో అదియును స్పష్టపరుపలేదు. బాధ్యతాయుత ప్రభుత్వస్థానములో మంచిప్రభుత్వముండేచాలును అని వారి ధోరణిగా ఉన్నట్లు కనబడుచున్నది. మంచిప్రభుత్వమంటె వారినిర్వచనమెట్టిదో అదియు స్పష్టముకాలేదు. వారు మనకు తెలియనిచ్చినంతవరకు దానివిశేషాలేవో మరొకమారు తెలుసుకొందము.

—

## పర్షియాలో సంస్కృతభాషయెడ గౌరవము

### ఒక కాశ్మీరి ముస్లిం అనుభవము

ట్రిబ్యూనుఅనుపత్రికలో ఒక కాశ్మీరముస్లిం పంపిన ఈక్రిందిసంగతులు ప్రకటించబడినవి:

నేను కాశ్మీరదినావాడిని. బాల్యమందు నేనుఇంటివద్దను, మసీదులోను సాధారణముగా మహమ్మదీయునికి నేర్పవిద్య నేర్చుకొంటిని. నాకు అరబ్బీ నేర్పిరి. ఖురానుచదువుట నేర్పిరి పెద్దవారిరిగిన తర్వాతనన్ను బడికిపంపిరి. అక్కడనేను యం-ఏ-వరకునన్ను చదివితిని.

తర్వాత నేను నాబంధువునితో సోదరునితో పర్షియాకు పోయి అక్కడపార్సీలో మంచిపండితుడగు నొక మిత్రునియింటికిగితిని వారికి ప్రాచీనపార్సీపద్ధతియు, అధునిక పార్సీపద్ధతియుకూడ తెలుసును పార్సీలో క్రొత్తపథమునుదీయవలెనని గాఢవాంఛగలవారు—వారొక సాహిత్యసమితిపద్ధ్యము. “ఫార్సీభాషలోను, సంస్కృతిలోను నవ్యజీవముపోసి వాటిఅభివృద్ధినినిరోధించిన విదేశీయపద్మోశనములను వాటినుండి తొలగచేసివేయుటయే ఆసమితియొక్క ఉద్దేశ్యము—ఈసమితియొక్క ఒకసమావేశమందు నన్నుఉపన్యసించ కోరిరి— ఎంతో దూరముఆలోచించినతర్వాత నేనందుకు ఒప్పుకొంటిని.

నిర్ణీతదినమున నేను మొగలాయి ఉద్యానముల నీలసరోవరముల వాటిషికారుల రామణీయకతనుగురించి దీర్ఘముగనుపన్యసించితిని— దీనకు నేను కాశ్మీరపరిశ్రమకు ఉదాహరణములనుగా కొన్ని మంచితివాసీలను కొయ్యచెక్కడములను చూపించితిని. అతివాసీలుఅన్నిటిలోకి మంచి శిరాజాలకును, కిర్మానులకును, ఆర్బీఅక్షరముల అందముగ మంచి తుర్కీడిజైనులకును ఉదాహరణములంటిని—

నేనింతదూరము చెప్పినతర్వాత ఒక్కరికైనను నేనుచెప్పినదానిలో ఆదరముకలుగలేదు, అది నాకాశ్చర్యమయ్యెను నేను కూర్చుండినతర్వాత ఒకయువకుడేచి రెండుమాటలుపన్యసించుటకై అధ్యక్షునిఅనుమతికోరెను. అనుమతుడైన తర్వాత ఉపన్యాసించుచు నాతను నాఉపన్యాసమునకు ఆశాభంగముకలిగించినదనియు, కాశ్మీరమునుగురించియు, దానిగొప్పతనమునుగురించియు నాకేమి తెలియదని తేలినదనియు చెప్పెను—

తర్వాతఅతడు ప్రాచీనమునుండి కాశ్మీర చరిత్రను చెప్పి కాశ్మీరమునుండి భారతీయవిజ్ఞానము, ప్రపంచమందలి గొప్పమతములలో నొకటియగు బౌద్ధమతము, టిబెటు, మధ్యఆసియా అలోకి ఎట్లువ్యాపించినదియు తెలిపెను. కాశ్మీరము భారతదేశపు గొప్పచక్రవర్తులలోనొకరై రాజతరంగిణీ గ్రంథకర్తయగుకల్హణుని జన్మస్థానమనియుచెప్పిరి తర్వాతవారు కాశ్మీరమందలి పూర్వపు గొప్పశిల్పముయొక్క ఆశ్చర్యములను తెలిపిరి. అశిల్పమునకు నిదర్శనమైన పెద్దదేవాలయముల శిథిలములిప్పటికినిఉన్నవి అట్టికొన్నింటి ఛాయాచిత్రములను వారుచూపించిరి.

ఆఅద్భుతశిల్పములను, వాటిలోని అమూల్యములైన ప్రాతగ్రంథములను ఎట్లుకూల్చివేయబడి పాడుచేయబడెనో వారువివరణచేసిరి పిమ్మట వారు కాశ్మీరములో పూర్వముసంస్కృతి విజ్ఞానమెట్లు మంచిఅభివృద్ధిలోనుండెనో, అగి వేదవిజ్ఞానకేంద్రముగనుండెనో తెలిపిరి

పరిశ్రమలవిషయములో నేను సభవారికిచూపించిన తివాచీలు భారతదేశపువికావనియు విషిరాజునుండియో, తుర్కీనుండియో అవలంబించిన డిజైనులుకలిగియున్నవనియు, అవి భారతీయకళయొక్క అనుకరణములైతే కావచ్చుకాని, భారతీయకళావని మనోభావముల సృష్టిమాత్రము కాజాలవనియు చెప్పిరి.

ఈవిధముగా ఆయువకుడు ౧½ గంటసేపు ఉపన్యసించెను— వారుచెప్పినదానిలో చాలాభాగము నాకు జ్ఞాపకములేదు కాని నాకు చిన్నతనమునిపించి, నాకేమీ తెలియకపోయెనుగదా యనిపించెను ఆసభఅయినతర్వాత కొందరు మిత్రులు కాశ్మీరభాషనుగురించియు, లిపినిగురించియు, నాకుకొన్ని ప్రశ్నలువేసిరి, కాని నేను వారలతోనాకు పార్సీభాష అరబ్బీలిపితప్ప నాకేమీ తెలియదని చెప్పితిని. చిన్నప్పటినుండియు నాకు వాటినే నేర్పియుండిరంటిని.

నేనుపర్షియాలో చూచినదానినిబట్టియు పరిశీలించినదానినిబట్టియు నాకు ముసల్మానులు జాతీయత నవలంబించుటయే మంచిదనిపించినది—వారలవిద్య శుద్ధభారతీయవిద్యగా నుండవలెను—వారివిషయములను, ఉత్సవములనుకూడ భారతీయములేఅయియుండవలెను మనలోభారతీయమునిన ప్రతివానిని ఏవగించుకొనుఅలవాటు ఎట్లుఏర్పడెనో నాకుబోధపడుటలేదు.

బళ్లలో నేర్పుడినదానిలో కాశ్మీరముయొక్క పూర్వముగొప్పతనమునుగురించిన చరిత్రను నేర్పవలెననియు, ప్రతివిద్యార్థికిని దేవనాగరిలిపిని నిర్బంధముచేయవలెననియు కాశ్మీర ప్రభుత్వమునకు నేనుమనవిచేయుచున్నాను. అట్లుచేసినచో భారతదేశము వెలుపలదేశాలలో తోడిమతస్థులముమనలను హీనముగా చూడకుందురు. భారతీయనాగరికతను హిందువులసొత్తుగా తీసికొనవలదు అని చూసేదని నా సహోదరులకు విన్నవించుచున్నాను, భారతదేశపు నాగరికతనుమనము పట్టుదలతో సంరక్షించుభారము వహించవలెను

—

## అఖిలభారత మహిళా మహాసభ

### అధ్యక్షురాలి సింహావలోకనము

కాకినాడలోజరిగిన అఖిలభారత మహిళామహాసభయొక్క ౧౭వ సమావేశమును సింహావలోకనచేయుచు అధ్యక్షురాలగు శ్రీమతివిజయలక్ష్మీపండిత్ గారు ఈక్రిందివిధముగ చెప్పినారు:

“ఈసారి మహిళామహాసభకుకొందరు యువతులైన ప్రతినిధులు వచ్చియుండుట ముఖ్యవిశేషము. ఈయువతీవర్గము ఇంతవరకు ఈమహాసభ కార్యములయందు అంతఅభిరుచిని చూపియుండలేదు, పూర్వముప్రతినిధులుగావచ్చిన యువతులు చాలతక్కువమంది వారలుఈసారివచ్చి మహాసభనుచర్చించవలసిన ప్రాతక్రొత్తసమస్యలను క్రొత్తరకపు పరిష్కారపద్ధతులను సూచించుట చాల సంతోషమైనవిషయము. ఈయువతులవల్ల క్రొత్తప్రాణముసమపోయుట చాలమంచిదని నేనను కున్నాను.

ఈసారి యీమహాసభ రెండు కార్యపథకములను నిర్ణయించినది, జిల్లాలలోను, రాష్ట్రములలోను మహాసభలను జరిపించుటకై ఆదేపనిగ కృషిచేయగలవారలను సిద్ధపరచుటఒకటి మహాసభయొక్క అవసరములప్రకారము ఒక గ్రామమున వ్యవస్థచేయుట రెండవది.

మేముకొన్నిఏండ్లుగా ఒకనిర్మాణ కార్యపథకముప్రకారము పనిచేయుచుంటిమి. అపనులలో ముఖ్యాంశములు హరిజనసేవ, వయోజనవిద్య గ్రామపునర్నిర్మాణము మున్నగునవి

ఇప్పటిపరిస్థితులయందు కలిగించునదిగా ఉన్నదని గ్రహించిమహాసభవారు చిక్కుసమయములలో వారలకుసహాయపడుటయందులకై ఒక అఖిలభారతస్వచ్ఛంద సేవికాదళమును ఏర్పాటు చేయుటకు నిశ్చయించినారు, ఇదిస్వతంత్రసంస్థగా వ్యవహరించగలదు సేవకులను సిద్ధపరచుటకై కేంద్రముల నేర్పాటుచేయుటకు మహిళా మహాసభ శాఖలు కోరబడినవి, పనిచేయుదళమీవ పనులిట్లుండును (౧) ప్రజలలో బెదరును తొలగించుట, (౨) ఉపద్రవమున్నదనిపించు ప్రదేశములనుండి స్త్రీలను, శిశువులను వేరుచోట్లకు గొనిపోవుటయందు తోడ్పడుట, (౩) దెబ్బలుమున్నగుబాధలపాలైనవారలకు పెట్టవలసినఅవసరమగు సహాయమును చేయుపద్ధతులను ఉపద్రవసమయములయందు బాధితులపరిచర్యచేయు పద్ధతులను నేర్పుట యేర్పాటుచేయుట, (౪) ఉపద్రవబాధితములైన ప్రదేశములలో ఆహారమును, ఇతరావసరములను యిప్పించు నేర్పాటుచేయుట, (౫) విమానాలదాడులతర్వాతచేసే రక్షణకార్యాలలో తోడ్పడుట, మరియు (౬) దేశములో అరాజకపరిస్థితులేర్పడకుండజూచుట.

—

## భాగల్పూరు సత్యాగ్రహులవిముదల

భాగల్పూరులో అఖిలభారత హిందూమహాసభజరుపరాదని ప్రభుత్వమువారువిధించినదానికి ఆజ్ఞను ఉల్లంఘించినందుకై అరెస్టుచేయబడినవారలను జనవరి ౫వ తేదిన వదిలివేసిరని తెలియుచున్నది ఈవిధముగా ౩౦౦ మందిఇప్పుడు కారాగారములో నున్నారు.

